# వాస్తు సూక్తులు

✡ ✡

✡ ✡ ✡ ✡

రచన


## గౌరు తిరుపతి రెడ్డి

వాస్తుశాస్త్ర పండితులు

ప్రొద్దుటూరు - 516 361.

మొదటి ముద్రణ : మార్చి 1991
ఆరవ ముద్రణ : మార్చి 1996

**వెల : రూ. 6.00**

ప్రతులకు : **ప్రజాహిత పబ్లిషర్స్**
గోల్కొండ క్రాస్ రోడ్స్, హైదరాబాద్.
✆ 631001

**బెంగుళూరు ఆఫీస్**
39/5, సెకండ్ ఫ్లోర్, అప్పారెడ్డి పాళ్యా,
అంబేద్కర్ కాలేజి వద్ద, ఇందిరా నగర్,
బెంగుళూరు - 38. ✆ 560179

**ప్రొద్దుటూరు కార్యాలయం**
వాస్తుకాంప్లెక్స్, మైదుకూరు రోడ్,
ప్రొద్దుటూరు - 516 361
✆ ఆఫీస్ : 52025, ఇల్లు : 52679.

**గమనిక:** ప్రతిరోజు అసంఖ్యాకంగా ఉత్తరాలు వస్తున్నందువల్ల వాటిలో వాస్తుపరమైన ఉత్తరాలకు సమాధానాలిచ్చుటకు సాధ్యం కాకున్నది. కావున అలాంటి ఉత్తరాలు వ్రాయకూడదని మనవి.

రెడ్డి గారు హైదరాబాద్‌లో ప్రతి నెల 4వ తేది నుండి 15వ తేది వరకు, బెంగుళూరులో 16 నుండి 26 వరకు ఉంటారు. సంప్రదించవలె ననుకున్న వారు ఫోన్ చేసి వస్తే మంచిది.





# ముందుమాట

ఒక విషయాన్ని సులభంగా స్మృతిలో నుంచుకొనుటకు సాయపడే సాధనాలే పాటలు, పద్యాలు, సామెతలు, సూక్తులు. పొందికైన పదాలతో పసందుగా రూపొందించిన పాటగాని, పద్యంగాని, సూక్తిగాని కంఠస్థం చేసేందుకు సులువుగా వుంటాయి. అవసరమైనపుడు క్షణంలో ధారణకు తెచ్చుకొనుటకు అనుకూలంగావుంటాయి. ఆది నుండి కోటానుకోట్ల నీతులను సామెతలుగా రూపొందించడం వల్లనే నేటికీ అవి మరుగున పడకుండ ప్రతినోట ప్రతిధ్వనిస్తున్నాయి.

విశ్వకవి, విప్లవయోగి వేమన తేటతెలుగు ఆటవెలదులలో అనేక ఉపమానాలతో రచించిన పద్యాలు ఈనాటికీ ఆబాలగోపాలం మరువలేని విధంగా అజరామరంగా నిలిచిపోయేందుకు కారణం, ఆయన అనుసరించిన రచనావిధానమే. ఆయన నీతిని అవినీతిగా, అవినీతిని నీతిగా మార్చలేదు. కొందరి బాహు బలానికి భయపడి తన భావాలను బలిపెట్టలేదు. కవిత్వం సమకాలీన సమాజతత్వానికి నిలువుటద్దం కావాలన్నదే



ఆయన ఆశయం. కవి సత్యాన్ని చాటే చరిత్రకారుడనీ, కల్పనలను వినిపించేవాడు కారాదని ఆయన సంకల్పం. నిద్రాణమైన సమాజాన్ని విద్రాణమొనర్చుట కవి కర్తవ్యం అనే ధ్యేయంతో లోటన్నది ఎవరిలో వున్నా, దాన్ని సూటిగా బయట పెట్టినాడు. గుమ్మడి కాయల దొంగంటే భుజాలు తడుముకొని మనం అవస్థపడవలసిందే కాని, ఆయన కులమత ప్రసక్తి లేకుండ ప్రతి వారిని ఏకినాడు - అదియు ప్రజల భాషలో. తన 'ఆటవెలదుల' ను అఖిలాంధ్ర లోకం నాల్కలపై 'తకిట తకిట తోం ' అంటూ నాట్యమాడేటట్లు చే (వ్రా)శాడు - ప్రజా కవియై వెల్లి విరిశాడు. వేమన సొంపైన నీతులను ఇంపుగాను, కఠోర సత్యాలను, కుటిలమగు సేతలను కఠినంగాను చెప్పిన ఘటనా ఘటన సమర్థుడు. ఇచ్చుట మచ్చునకు కొన్ని :

'తల్లి నెరుగువాడు దైవంబు నెరుగును - మన్ను నెరుగువాడు మిన్ను నెరుగు '.

'భూమి నాదియన్న పుడమి పక్కున నవ్వు - దాన హీనుజూచి ధనము నవ్వు '.

'చదివినతని కన్న చాకలి సతిమేలు - కుల వేల్పుకన్న కుక్క మేలు '.

'కావవలయు మగడు కాంత నెల్లప్పుడు - కావలేని వాడు చావ వలయు '.

'చెమట కారునట్లు శ్రమబెట్టి దేహంబు - గడన జేసి కూడు గుడవ వలయు '.

ఇలాగా లక్ష్యోపలక్షల నీతులను విలక్షణంగా మన చక్షువుల ముందుంచిన ముముక్షువాయన. మరచిపోదామన్నను మరపునకు రాని మధురమగు మధువొలికించు పదాలాయనవి.

ఇలాంటివే జనుల నోటిలో నిత్యం నానునట్టి కొన్ని నానుడులను చూడండి.

'చెబితే వినడు - కొడితే ఏడుస్తాడు '.

'తల్లికి కూడు పెట్టనివాడు - తగుదునని తగువు తీర్చవచ్చాడట '.

'గురువుకు పంగనామాలు పెట్టే రకం '.

'నీతి లేని వాడు జాతి కెంతో కీడు '.

'నిండామునిగిన వానికి చలేమిటి ' ?

'పుట్టుకతో వచ్చిన బుద్ధి - పుడకల్లో బెట్టే వరకు పోదు '.



'యథార్థ వాది - లోక విరోధి '.

'ముల్లె పెంచేది ఇల్లు - కొల్ల గొట్టేది కొంప '.

ఇలాంటి వెన్నో సూక్తులు మన ఉక్తులతో మేళవింపబడి భాషకు భూషణాలుగా భాసిల్లుతున్నాయి. *1957* వ సంవత్సరము నుండి వాస్తుశాస్త్రంలో పరిచయమేర్పడి, ఇన్నేళ్ళ స్వానుభవాలతో నేను రచించిన వ్యాసాలు పలు పత్రికలలో ప్రచురణకు నోచుకున్నవి. *1987* ఫిబ్రవరిలో " వాస్తుశాస్త్ర వాస్తవాలు " గ్రంథ రచన గావించి, వెలువరించడమయింది. ఈ గ్రంథం కేవలం తొమ్మిది సంవత్సరాల లోపే పదునాల్గవ ముద్రణ చేరుకొన్నదంటే అది ఎంతగా పాఠకుల ఆదరణను చూరగొనిందో వేరుగా చెప్పనవసరం లేదు. సూక్తుల ప్రభావం మానవులపై ఎంతో వున్నదన్న సత్యానుసారం నేను వాస్తుశాస్త్రంలోని కొన్ని మూల సూత్రాలను సూక్తులుగా మలిస్తే ప్రజల నాల్కలపై కలకాలం నిలువగలవని తలచాను. ఈ ఉద్దేశ్య విశ్వాసాలే వాస్తు సూక్తులుగా రూపు దాల్చుటకు హేతువులైనాయి.

ఇంటిలో ఫలానా లక్షణం, ఫలానా ఫలితాన్ని ఇస్తుందని నేను చెప్పడం, మిత్రులు బి. నాగభూషణ రెడ్డి, రసవిహారి, జీరెడ్డి చెన్నారెడ్డి, జి.ఎన్. రెడ్డి, బి. అచ్యుతరాజు, ఎస్సెల్ సుధాకర్ గార్లు వానిని పొంకంగా రూపొందించడం జరిగింది. ఉదాహరణకు నేను 'ఆగ్నేయంలో పొయ్యి వుంటే మంచిదని' అంటే వారు 'ఆగ్నేయంలో పొయ్యి - అమరించును శుభాలు వెయ్యి' అనేవారు. ఇలాగా ఈ చిరుపొత్తం ఆకృతి దాల్చేందుకు వారు సాహిత్య సహకార మందించినారు. అందులకు నేను వారికి సదా హృదయపూర్వక ధన్యవాదాలర్పిస్తున్నాను. వీటిని నోటికి నేర్చుకొన్న యే వ్యక్తి అయినా ఒక ఇంటిని చూడగానే దాని లక్షణాలను బట్టి వాని శుభా శుభాలను ఇట్టే చెప్పివేయగల దిట్ట కాగలడు. అలా ప్రతి వారికి వాస్తుశాస్త్రం మతిలో నిలవాలనీ, మరింత విస్తృతంగా వ్యాప్తి కావాలని ఆశిస్తున్నాను.

మీ.



# శాస్త్రం అంటే?

నన్ను కొందరు అడుగుతుంటారు, 'ఏ గ్రంథాన్ని ఆధారంగా చేసుకొని మీరు మీ వాస్తు శాస్త్ర వాస్తవాలు వ్రాశారు'? అని. ఈ పశ్న నన్ను ఆశ్చర్యపరుస్తుంటుంది. ఏమిటీ విచిత్రం ? ఎవరైన ఒక గ్రంథం వ్రాయాలంటే పూర్వమున్న గ్రంథాలను ఆధారంగా చేసుకొనే వ్రాయాలన్నమాట. ఏమిటీ మానవుల వైఖరి ? మనం మన జీవితంలో ఎంతో పరిశోధన గావించి, అనుభవం గడించి మన అనుభవంలో నిగ్గుదేలిన సత్యాలను ఒక గ్రంథంగా వ్రాయకూడదా ? ప్రతిదీ పూర్వ గ్రంథాలను చూచి వ్రాసి తీరవలసిందేనా ? అలా వ్రాస్తేనే శాస్త్రమా ? అనే సందేహాలు నన్ను వేధించేవి. అందుకు సమాధానం చెప్పవలెననే ఉద్దేశ్యం నాలో బలపడసాగింది. సంస్కృత శ్లోకాలతో ఉండేదే శాస్త్రంగానీ మరేదీ కాదనేది మన దేశంలో బలపడిపోయిన సిద్ధాంతం. అలాగని పూర్వ గ్రంథాలను తేలిక చేయడంలేదు. వానిలో కొన్ని మహత్తర విషయాలున్నవి. గంగానది

హిమాలయాల్లో జన్మించి కొంత మేర పారేవరకు గూడా ఆ నీరు పవిత్రమైందే, కానీ జనావాసాల్లోకి ప్రవేశించేటప్పటికి ఆ నిర్మలమగు జలంలో కల్మషం చేరింది. అలాగే పూర్వం విజ్ఞాన ఖనులు విరచించిన గ్రంథాలు మొత్తం జనులందరికీ శుభదాయకమైన విషయాలతో వుండినవి. కానీ రాను రాను కొందరు స్వార్థపరులు ఈ గ్రంథాలలో తమ సంకుచిత భావాలను సంకలనం చేసి వాని పవిత్రతను పాడు చేసినారు. ఈనాడు ఏ వాస్తు గ్రంథంలో చూచినా కులాలు చోటు చేసుకొన్నాయి. ఇది దౌష్ట్యం కాదా ? అదే గాకుండా ఆనాటి అనుభవాలు పరిమితం. అనుభవాలు పెరిగే కొలదీ అందులో ఎన్నో మార్పులు జరిగి తీరుతాయి. అయితే కొన్ని మౌళికమైన సూత్రాలు ఏ మాత్రం మారవు. అవి మార్చుటకు ఎవరి తరం కాదు కూడా. కానీ అసలు విషయాల మధ్యన కొందరు దుర్మార్గులు చేర్చిన విషయాలున్నవే, అవి ప్రమాదకరమైనవి. కానీ, అవి కాలవాహినిలో నిలువలేవు. ఒడ్డునకు కొట్టుకొనిపోయి నిలువునా వాడిపోతాయి. అదే నేడు జరిగేది.



మానవజాతి కంతకును ఉపకరించేది శాస్త్రంగానీ, కులాలకు జాతులకు పరిమితమై వేరు వేరు విధములుగా రూపొందింది శాస్త్రం కాదు, కాబోదు.

ఒకనాడు సముద్ర ప్రయాణం చేయడం అగ్రవర్ణాల వారికి నిషిద్ధంగా వుండేది. అలా ఎవరైనా చేస్తే వారికి ప్రాయశ్చిత్త కర్మమంటూ చేసేవారు. తత్సంబంధమైన శ్లోకాలు కూడా రూపొందించారు. మరి ఈనాడు వానిని గూడా శాస్త్రాలంటే ఎవరైనా నమ్ముమవారున్నారా? విషవాయువులను ఉత్పత్తి చేసే కర్మాగారాల్లో పనిచేయు వారందరూ మాస్కులను విధిగా ధరించవలసి వచ్చినట్లు మనదేశం కుల మతాలనే విష వాయువులను తయారు చేసే ఒక పెద్ద ఫ్యాక్టరీగా మారింది, ఇందున్న ప్రతి ఒక్కరు ఇష్టమున్నా లేకున్నా ఆ తొడుగులను తొడుక్కోవలసిన పరిస్థితులేర్పడినవి. దీనిని అధిగమించవలెనన్న సత్సంకల్పం కొందరికి వున్నను వానిలో మునిగి తేలువారు అధికులున్నారు గాన, ఈ 'కొందరు' వారి ధాటికి ఊపిరాడక ఉక్కిరిబిక్కిరి కావలసిందేతప్ప తప్పించుకొను దారి

లేదు. ఎందరో అమాయకులు నేటికీ ఈ కులాలకు కొలికి వేయబడిన గ్రంథాలను కూడా శాస్త్రాలని నమ్మతున్నారు.

వాస్తుశాస్త్రంలో కులాలకు స్థానం లేదు. ఇది కులము, మతము, జాతి అనే భేదం లేని శాస్త్రం. జగత్తులోని సర్వమానవాళికి సమానశ్రేయాన్ని సమకూర్చే శాస్త్రం. ఊహాగానాలు లేని అనుభవ పూర్వకమగు అపూర్వశాస్త్రం. కులాలుగాక వాస్తవాలు చోటు చేసికొన్న ఈ 'వాస్తు సూక్తుల'ను విజ్ఞులు, విశాల భావాలుగల మహోదయులెల్లరు చదివి హర్షిస్తారని ఆశిస్తాను.

**ఉర్వివారికెల్ల నొక్క కంచము బెట్టి**
**పొత్తు గుడిపి కులము - పొలయ జేసి**
**తలను చెయ్యిబెట్టి - తగనమ్మ జెప్పరా**
**విశ్వదాభిరామ ! వినురవేమ !!**



# వాస్తుశాస్త్ర వాస్తవాలు

గ్రహణం బట్టిన గృహవాస్తును వెలికి లాగి వెలుగు జూపిన " **వాస్తుశాస్త్ర వాస్తవాలు** " పదునాల్గవ ముద్రణ వెలువడింది.

దిశను బట్టి దశ పట్టుతుందని విశదపరచే " అష్టైశ్వర్యాల " ను సంకేతంగా *(Symbolic)*తెలుపు ముచ్చట గొలుపు ముఖచిత్రంతో అమూల్యమగు అదనపు వినూత్నానుభవాలతో స్వరాష్ట్ర మందేగాక రాష్ట్రేతరాంధ్రాభిమాన పాఠకుల ఆదరానురాగాలను అపరిమితంగా చూరగొని కేవలం తొమ్మిది సంవత్సరాల లోపే పదునాల్గవ ముద్రణగా తమ ముందు కరుదెంచింది " **వాస్తుశాస్త్ర వాస్తవాలు** ". ఇది పురోభివృద్ధిని కోరుకునే ప్రతి గృహస్థు విధిగా చదువదగిన పొత్తం - ప్రతి గృహానికి అసాధారణ విత్తం.

# ముఖచిత్ర వివరణము

ప్రకృతి పాంచభౌతికమయం. పంచభూతాల ప్రభావం మానవ జీవితంపై ఎంతేని వున్నది. ఈ పంచభూతాలే గృహనిర్మాణంలో ప్రధాన పాత్ర వహిస్తున్నాయి. వీని ప్రాముఖ్యతనే ఈ పొత్తం ముఖచిత్రంపై ప్రదర్శించడమైనది. తూర్పున మనకు చరాచర జీవనాధారమై వెలుగు, వేడిని ప్రసాదించు సూర్యుణ్ణి, ఆగ్నేయంలో అగ్నిని, దక్షిణంలో ధనసంబంధమైన పూర్ణకుంభం, నైరృతిలో ఉన్నతమునకు ప్రతీకలైన పర్వత, ఆకాశాలను, పశ్చిమంలో పాడి పంటల గుర్తు ఆవు. వాయవ్యంలో వాయువునకు సంకేతంగా పతాకాన్ని, జింకను, ఉత్తరాన బయలు, ఈశాన్యంలో పల్లమునకు గుర్తుగా జలపూర్ణమగు కొలనును చిత్రించడమైంది. ఈ చిత్ర వైశిష్ట్యాన్ని పాఠకులు గ్రహింపమనవి.

**పాంచ భౌతికంబు - వాస్తు ప్రపంచంబు**
**పాంచ భౌతికంబు ప్రాణికోటి**
**పంచభూత శ్రేణి ప్రాపకమ్ము వలన**
**పరమ భోగ భాగ్య - పథము గనుడు.**



# అష్టదిశల విశిష్టతలు

అష్టదిశల ఉనికిని అనుసరించి మానవ జీవితంలో అనుకూల, ప్రతికూల ఫలితాలు కలుగుతుంటాయి. తూర్పు పితృస్థానం - తూర్పు ఖాళీ స్థలం లేక హద్దు వరకు మూతపడితే పురుషాధారములేని ఇల్లుగా మారుతుంది. ఆగ్నేయం ఆరోగ్యానికి మూలము. దక్షిణం ధనానికి, పాడి పంటలకు, సుఖశాంతులకు సంబంధించినది. నైరృతి నడవడికకు, మరణానికి హేతువవుతుంది. పశ్చిమం వల్ల ప్రఖ్యాతి, ఉన్నతి కలుగుతాయి. వాయవ్యం వ్యవహారాల విధానము మారుస్తూ మిత్ర శత్రుత్వాలను కల్గిస్తుంది. ఉత్తరం మాతృస్థానం - ఆ దిశన ఖాళీ స్థలం లేకపోతే దశలో మార్పు వచ్చి స్త్రీ నష్టము కలుగుతుంది. ఈశాన్యం పురుష సంతతికి సంబంధించిన ఫలితాలిస్తుంది. ఈశాన్యం లోపిస్తే మగ సంతానం బ్రతుకక అపారమైన ఆస్తివున్నా అనుభవించే దిక్కు లేని కొంప అవుతుంది. ఇంటిలోని అష్టదిక్కులను చూడగానే ఆ యింటి వారికి కలిగే ఫలితాలను వివరంగా విశదీకరించవచ్చు. అట్లే ఇల్లాలి ముఖము వీధి గుమ్మము చెప్పును అనేది ఆర్యోక్తి.

# వాస్తు సూక్తులు

## 1. నిర్మాణ క్రమము

1. వాస్తుబలం గల స్థలం, కాస్తయినా చాలు - గృహస్థుకు చేస్తుందది ఎంతో మేలు.
2. మొదట స్థలశుద్ధి చేయండి - ఆదట ఇల్లు కట్టేందుకు సిద్ధంకండి.
3. మొదట ఇంటి చుట్టూ ప్రహరి గోడ నిర్మించు - మీదట అన్ని విధాల అది నిన్ను రక్షించు.
4. వాస్తు చెడిన వాయవ్య నిర్మాణం - దివాలాకు ప్రయాణం.
5. వాస్తు రీతిగా వాయవ్య నిర్మాణం - సిరికి ఆహ్వాన తోరణం.
6. పునాది త్రవ్వకం ఈశాన్యం నుండి ప్రారంభించు - అదియే నిర్మాణాన్ని సత్వరం ముగించు.



7. పునాది గోడ నైరృతి నుంచి మొదలుపెట్టి కట్టడం - అనేక శుభాలకు హారతి పట్టడం.
8. నైరృతిని మూలమట్టానికి సరిచేసి కట్టడం - సక్రమమైన సిరులను పొందడం.
9. వీధి నడక - నీ విధి వ్రాతకు కూడిక.

## 2. ద్వారాలు - నడకలు

10. తూర్పు ద్వారం - శుభకరమైన వరం.
11. తూర్పు ఆగ్నేయ ద్వారం - చోరాగ్ని బాధలకు, స్త్రీల వ్యాధులకు స్థావరం.
12. దక్షిణ ఆగ్నేయ ద్వారం - స్త్రీలకు చేస్తుంది ఉపకారం.
13. దక్షిణ ద్వారం - గృహస్థులకు శుభకరం.
14. దక్షిణ నైరృతి వాకిలి - సుదతుల సుఖాలను నలుగదంచు రోకలి.
15. పశ్చిమ నైరృతి వాకిలి - పురుషుల జీవితాలకు ఘోరకలి.

16. పశ్చిమ ద్వారం - గృహస్థులకు క్షేమకరం.

17. పశ్చిమ వాయవ్య ద్వారం - పలు శుభాలకు పసిడి హారం.

18. ఉత్తర వాయవ్య ద్వారం - నిరంతర చంచల వ్యవహారం.

19. ఉత్తర ద్వారం - ఉత్తమ ప్రగతికి రత్నహారం.

20. ఉత్తర ఈశాన్య ద్వారం - విత్త ప్రాప్తికి, స్త్రీ సౌభాగ్యానికి ఆధారం.

21. తూర్పు ఈశాన్యద్వారం - యజమాని కీర్తికి, సంతతి పురోగతికి మందారం. (మందారం = కల్పవృక్షం).

22. తూర్పు నుండి దక్షిణ నైరృతి ద్వార గమనం - స్త్రీలకు సంకటాల ఆగమనం. (ఆగమనం = రాక).

23. తూర్పు నుండి పశ్చిమ నైరృతి ద్వారం - పురుషులకు అరిష్టాల ఆగమనం.

24. తూర్పు నుండి పడమటికి వరుస వాకిళ్ల నడక - వరించును కీర్తి పురుషులను వీడక.



25. తూర్పు నుండి పశ్చిమ వాయవ్యానికి గమనం - అనారోగ్యాల ఆగమనం.

26. తూర్పు ఆగ్నేయం నుండి పశ్చిమ ద్వారగమనం - యజమాని పతనం.

27. దక్షిణ ఆగ్నేయం నుండి ఉత్తర వాయవ్యానికి నడక - కడలేని కలహాలకు పుట్టుక.

28. దక్షిణం నుండి ఉత్తర వాయవ్య ద్వార గమనం - స్త్రీలకు కలిగించును దుర్వర్తనం.

29. దక్షిణం నుండి ఉత్తర ఈశాన్య ద్వారగమనం - ఉవిదల సౌభాగ్య జీవితానికి విహారవనం. ( ఉవిద = స్త్రీ).

30. పశ్చిమం నుండి ఉత్తర ఈశాన్యద్వారాల నడక - నిశ్చయంగా శుభాలనిస్తుంది వీడక.

31. పశ్చిమం నుండి తూర్పు ఈశాన్యానికి ద్వార గమనం - పురుష సంతానానికీ, విజ్ఞానానికీ సోపానం.

32. ఉత్తరం నుండి దక్షిణానికి ద్వార గమనం - తరుగని సిరులకు ఆహ్వానం.

33. ఉత్తరం నుండి దక్షిణ ఆగ్నేయానికి నడక - కలహాగ్నికి పిడక.

34. ఉత్తరం నుండి దక్షిణ నైరృతి నడక - ఆడవారికి అశుభాల పడక.

35. పశ్చిమానికి తలవాకిలి ఉన్న యింటికి - తూర్పున తప్పక ఉండాలి వాకిలి.

36. దక్షిణానికి తలవాకిలి ఉన్న యింటికి - తప్పకఉండాలి వాకిలి ఉత్తరానికి.

37. కాపురం లేని దక్షిణ ద్వారమున్న కొట్లకు (అంగళ్ళకు) ఉత్తరంలో ద్వారం ఉంటే మంచిది - లేక పోయినా లేదు ఇబ్బంది.

38. కాపురం చేయని పశ్చిమ ముఖద్వారమున్న కొట్లకు తూర్పుకు ద్వారం ఉండటం మంచిది - లేకున్నా లేదు పెద్ద ఇబ్బంది.

39. తూర్పు సింహద్వారం ఉన్న యింటికి - అవసరాన్నిబట్టి ఉండాలి ద్వారం పశ్చిమానికి.

40. ఉత్తర సింహద్వారం ఉన్న యింటికి -అవసరాన్నిబట్టి ద్వారం ఉండాలి దక్షిణానికి.



## 3. గేట్లు

41. తూర్పు గేటు - ఇంటిలోనికి రానివ్వదు యే లోటు.

42. తూర్పు ఆగ్నేయం గేటు - శుభాలకు బల్లెం పోటు.

43. దక్షిణ ఆగ్నేయం గేటు - శుభాలకు వల్లెవాటు.

44. దక్షిణాన గేటు వుంచడం - శుభాలకు రాచబాట నిర్మించడం.

45. దక్షిణ నైరృతి గేటు - కాలనాగు కాటు.

46. పశ్చిమ నైరృతిలో గేటు వుంచడం - అకాల మరణాన్ని ఆహ్వానించడం.

47. పడమర గేటు - పురుషుల కీర్తికి సీటు.

48. పశ్చిమ వాయవ్యం గేటు - పలు శుభాలకు చోటు.

49. ఉత్తర వాయవ్యం గేటు - ఇంట్లో వారికి నిత్యం చేటు.

50. ఉత్తరంలో గేటు - సంతోష తంత్రులు మీటు.

51. ఉత్తర ఈశాన్యంలో గేటు - ఉత్తమ శుభాలకు చోటు.

52. తూర్పు ఈశాన్యంలో గేటు వుంచడం - సుఖశాంతులకు బాటను నిర్మించడం.

## 4. గోడలు

53. తూర్పు గోడకన్నా పడమటి గోడ ఎత్తు - తరుగులేని సౌభాగ్యాలకు వీడని పొత్తు.

54. పడమటి గోడకన్నా తూర్పు గోడ ఎత్తు - అనారోగ్యానికి పొత్తు.

55. దక్షిణం గోడకన్నా ఉత్తరం గోడ ఎత్తు - ఐశ్వర్యానికి విపత్తు.

56. ఉత్తరం గోడకన్నా దక్షిణం గోడ ఎత్తు - అష్టైశ్వర్యాలు నీ సొత్తు.

57. తూర్పు గోడ వక్రం - పురుషులకు గోడు కలిగించే చక్రం (వక్రం = వంకర).



58. దక్షిణ గోడ వక్రం - స్త్రీల ఆరోగ్యాన్ని కబళించే నక్రం ( నక్రం =మొసలి).

59. పడమటి గోడ వక్రం - అరిష్టాల క్రమం. (క్రమం = వరుస)

60. ఉత్తరం గోడ వక్రం - స్త్రీకి, సిరికి హానికరం.

## 5.నిష్క్రమణ ద్వారం ( వెలుపలికి వెళ్ళు వాకిలి)

61 ఈశాన్యం గదికి తూర్పున నిష్క్రమణ ద్వారం - శుభాలు అపారం.

62. ఈశాన్యం గదికి ఉత్తరాన నిష్క్రమణ ద్వారం - సిరులకు ఆకరం.

## 6. సోపానములు (తాపలు)

63. తూర్పు నుండి పడమటికి తాపలు కట్టుకో - కీర్తి కిరీటం పెట్టుకో.

64. ఉత్తరం నుండి దక్షిణానికి మెట్లు కట్టుకో - ప్రీతిగా ధనాన్ని ఆకట్టుకో.

## 7. ఖాళీ స్థలాన్ని కలుపుకోవడం

65. తూర్పు స్థలాన్ని కలుపుకో - కీర్తి సంపదలను గెలుచుకో.

66. ఆగ్నేయ స్థలాన్ని కలుపుకోవద్దు - ఆపదలను దాపునకు పిలుచుకోవద్దు.

67. దక్షిణ స్థలాన్ని కలుపుకోకు - రక్షణ కవచాన్ని కోల్పోకు.

68. నైరుతి స్థలం వూరకవచ్చినా కలుపుకోకు - కష్టాలను తెచ్చుకోకు.

69. పశ్చిమస్థలాన్ని కలుపుకోవడం - పచ్చని ఆరోగ్యానికి చిచ్చుపెట్టుకోవడం.

70. ఉత్తర స్థలాన్ని కలుపుకొమ్ము - ఉత్తమ ఫలాన్ని అందుకొమ్ము.

71. ఈశాన్యంలోని స్థలాన్ని కొనడం - విశేష ఐశ్వర్యాలతో మనడం.

72. ఈశాన్యంలో స్థలంపోతే - ఇంట్లో ఇనుపగజ్జెల మోతే (ఇనుపగజ్జెలు దరిద్రానికి గుర్తులు ).



## 8. ఖాళీ స్థలాలు

73. పడమటి కన్నా తూర్పున ఎక్కువ ఖాళీ స్థలం - పురుషుని కీర్తికి కిరీటం.

74. ఉత్తరం కన్నా దక్షిణంలో ఎక్కువ ఖాళీ స్థలం - అన్ని అనర్థాలకు మూలం.

75. తూర్పు కన్నా పడమట ఎక్కువ ఖాళీ స్థలం - పురుషుల యోగ్యత విఫలం.

76. దక్షిణం కన్నా ఉత్తరాన ఎక్కువ ఖాళీ స్థలం - సిరులకు, స్త్రీల సుఖాలకు ఆలవాలం.

77. ఈశాన్యంలో ఖాళీ లేని గేహం - శ్వాస నిలిచిపోయే దేహం (గేహం = ఇల్లు).

## 9. సరిహద్దు నిర్మాణం

78. తూర్పు సరిహద్దులో చేసిన నిర్మాణం - కూర్చుకొన్న శుభాల నిర్మూలనం.

79. దక్షిణ సరిహద్దుపై చేసిన నిర్మాణం - భోగభాగ్యాలకు సలక్షణ కళ్యాణం.

80. పశ్చిమ సరిహద్దు మీద చేసిన నిర్మాణం - పురుషునికి కీర్తికరం.

81. ఉత్తర సరిహద్దున నిర్మాణం - సిరికీ, స్త్రీ పురోగతికీ విషబాణం.

## 10.వీధి వరుస దాటి వచ్చిన గృహాలు

82. తూర్పు వీధిని మ్రింగిన (చొచ్చుకొని వచ్చిన) ఇల్లు గలవాడు - వీధి కంతకూ మొనగాడు.

83. వీధి వరుసను దాటి ముందుకు వచ్చిన దక్షిణముఖ గృహం - అశుభాల ప్రవాహం.

84. వీధి వరుసను దాటి ముందుకు వచ్చిన పశ్చిమ గృహం - అరిష్టాల అగాధం.

85. ఉత్తరంలో వీధిని మ్రింగిన ఇల్లు గలవాడు - సిరిలో కుబేరునికి సరిజోడు.



## 11. నీటి వాటం

86. వాన నీరు, వాడుకనీరు ఈశాన్యానికి పారనిమ్ము - శుభాలు రానిమ్ము.

87. ఈశాన్యంగా జల ప్రవాహం - సకల సంపదలకు ఆధారం.

88. ఇంటిలోని నీరు దక్షిణానికి పోవడం - ఇంతులు అనారోగ్యవతులు కావడం.

89. ఇంటిలోని నీరు దక్షిణ నైరృతి నుండి వెళ్ళడం - స్త్రీల ఆరోగ్యం చెడడం.

90. వాన నీరు, వాడుక నీరు పశ్చిమ నైరృతి నుండి పోవడం - పురుషులు అనారోగ్యానికి గురికావడం.

91. నైరృతిలో జల ప్రవాహం - వికృత ఫలితాల నివహం ( నివహం = గుంపు).

92. వర్షపు నీరు, వాడుక నీరు పడమటికి పారడం - పురుషుని ఆరోగ్యం దిగజారడం.

93. ఇంటిలోని నీరు ఉత్తరానికి పారడం - ఇంతులకు ఆరోగ్యం చేకూరడం.

94. ఇంటిలోని నీరు, ఆవరణంలోని నీరు ఉత్తర ఈశాన్యానికి పారనిమ్ము - కలకంఠి దరికి ఆరోగ్యం చేరనిమ్ము (కలకంఠి = స్త్రీ).

## 12. తూములు

95. తూర్పు దిశలో తూము - సుఖశాంతులకు నోము.

96. తూర్పు ఆగ్నేయం తూము - పిల్లలకు అపశకునపు మోము.

97. దక్షిణం వైపు తూము వుంచడం - సుఖశాంతులను త్రుంచడం.

98. దక్షిణ నైరృతి తూము - స్త్రీల ఆరోగ్యానికి కత్తిమీద సాము.

99. పశ్చిమ నైరృతి తూము - పురుషుల ప్రతిభకు ధూము.

100. పశ్చిమ దిశలో తూము - పలు సుఖాలను కాటు వేయు పాము.

101. ఉత్తర వాయవ్యంలో తూము - నిత్యం జగడాల గీము. ( గీము = ఇల్లు)



102. ఉత్తర దిశలో తూము - ఉత్తమ దశకు మూలము.

103. ఉత్తర ఈశాన్యంలో తూము వుంచడం - సిరులకు నివాసం కల్పించడం.

104. తూర్పు ఈశాన్యంలో తూము - పురుషుల ఆరోగ్య పంటకు నీరు తోడు ఏతాము.

## 13. దిశ చూస్తున్న ద్వారాలు ( దిక్సూచికి)

105. తూర్పు ముఖద్వారం ఈశాన్యం చూస్తుంటే - సిరియు, వంశాభివృద్ధియు విడిపోని జంటే.

106. ముఖద్వారం తూర్పును చూస్తుంటే - పురుషుల పురోభివృద్ధికి పంటే.

107. దక్షిణ ద్వారం దక్షిణాన్ని చూడడం - ఇంటిలో ఐశ్వర్యాలు కూడడం.

108. పశ్చిమాన్ని చూస్తున్న ద్వారాలు - పలుశుభాల మణిహారాలు.

109. ఉత్తర ద్వారాలు ఉత్తరాన్ని చూస్తున్న - ఉత్తమ శుభాలు చేకూర్చునన్నా !

110. ఉత్తర ద్వారాలు ఈశాన్యాన్ని చూస్తుంటే - ఉత్తమ గుణవంతులు జనించేది ఆ యింటే.

## 14. స్నానం గది

111. తూర్పున స్నానం గది - సుఖశాంతులకు విడిది.

112. దక్షిణాన గొయ్యిలేని స్నానం గది - శుభాల రథసారథి.

113. పశ్చిమాన గొయ్యిలేని స్నానం గది - సుఖాలకు పెన్నిధి.

114. ఉత్తరాన స్నానం గది - ఉత్తమ సుఖాలు కలిగిస్తుందది.

## 15. శయ్యాగృహం (పడకటిల్లు)

115. తూర్పు గదిలో శయ్య - వీలులేనప్పుడు వెయ్యి.



116. ఆగ్నేయ గదిలో యజమాని పడక - ఆరోగ్యాన్ని దున్నివేసే మడక.

117. దక్షిణం గదిలో పడక - ఆరోగ్యం వీడదిక.

118. నైరృతి గదిని శయ్యాగృహంగా మార్చుకో - అన్ని విధాల యశోవిజయాలను సమకూర్చుకో !

119. పడమటి గదిలో పడక - ఒడిదుడుకులు లేని సుఖాల కూడిక.

120. వాయవ్యం గదిలో యజమాని శయనం - రయాన చాంచల్యం వైపుకు పయనం. (రయాన = వేగంగా)

121. ఉత్తర గదిలో యజమాని పవళించడం - ఉపద్రవాలను వరించడం.

122. ఈశాన్యం గదిలో శయనం - నశింపజేయు వ్యాధులకు ఆహ్వానం.

123. నైరృతి గదిలో యజమాని పడక - అభివృద్ధి దిశలకు గృహస్థు నడక.

124. దక్షిణం గదిలో మొదటి సంతానం నిద్రించడం - చింతలను దూరంగా వుంచడం.

125. ఆగ్నేయంలో రెండవ సంతానం నిద్రించడం - ఆనందపు విందులనెప్పుడు పొందడం.

126. పశ్చిమాన మూడవ సంతానం నిద్ర - ప్రశాంత జీవనానికి ప్రకృతి వేయు ముద్ర.

127. వాయవ్యంలో నాల్గవ సంతానం నిద్రించడం - వివాదాలకు తావుండక జీవించండం.

128. ఉత్తరాన పిల్లల నిదుర గదులు - ఉత్తమ ప్రగతికి మూలికలు.

## 16. తలాపి ఉంచడం

129. తూర్పు తలాపి నిద్ర - ఆరోగ్యానికి భద్రం.

130. దక్షిణం వైపు తలవుంచి నిద్రించడం - ధవళపు ఆరోగ్య పతాకాన్ని ఎగిరించడం. ( ధవళము = తెల్లని , నిర్మలము).



131. నిదురించునపుడు పడమటికి వుంచిన తల - ఉవ్వెత్తున లేచే పీడకలల అల.

132. ఉత్తరంగా తలవుంచి నిద్రించడం - తత్తరపాటును కలిగించు వ్యాధి విషాలను చిందించడం.

## 17. పొయ్యి

133. తూర్పు ముఖంగా ఆగ్నేయంలో వంట - ఇంట సుఖాల పంట.

134. ఆగ్నేయంలో పొయ్యి - అమరించును శుభాలు వెయ్యి.

135. దక్షిణ ముఖంగా వండు వంట - దరిద్రాన్ని కొని తెచ్చుకొనే తంట.

136. నైరృతిలో పొయ్యి - వీలులేనప్పుడు వెయ్యి.

137. పశ్చిమ ముఖంగా వండే వంట - అనుకూలం లేనప్పుడు వాయవ్యం గదిలో చేసుకోయింట.

138. పశ్చిమ వాయవ్యంలో పొయ్యి - అవకాశం లేనప్పుడు వెయ్యి.

139. ఉత్తర వాయవ్యంలో పొయ్యి - కత్తెర బోనులో పెట్టిన చెయ్యి.

140. ఉత్తర ముఖంగా చేయు వంట - ఉపద్రవాల ఊబి గుంట.

141. ఈశాన్యంలో పొయ్యి - ఐశ్వర్యాలను ముంచు నుయ్యి.

## 18. లెట్రిన్

142. తూర్పు ముఖంగా లెట్రిన్‌లో కూర్చోకండి - అది ఆరోగ్యానికి గండి.

143. తూర్పున సెప్టిక్ ట్యాంకు - ఉన్నతికి మంచి లింకు.

144. ఆగ్నేయంలో మరుగు దొడ్డి - ఆరోగ్య ధనానికి చక్రవడ్డీ.

145. ఆగ్నేయంలో గొయ్యితో ఉన్న మరుగుదొడ్డి - ఆరోగ్యాన్ని చితుకగొట్టు ఇనుప కడ్డీ.



146. దక్షిణ ముఖంగా లెట్రిన్‌లో కూర్చొనండి - ఆరోగ్యాన్ని చేకూర్చుకొనండి.

147. సెప్టిక్ ట్యాంక్ దక్షిణం - సేఫ్టీలేని బ్రతుకే అనుక్షణం (సేఫ్టీ = క్షేమం).

148. నైరృతిలో గొయ్యితో పాయిఖానా - వేస్తాయి ఇంటిలో రోగాలు ఠికానా.

149. పడమర ముఖముంచి లెట్రిన్‌లో కూర్చోకండి - ఆరోగ్యాన్ని పాడుచేసుకోకండి.

150. సెప్టిక్ ట్యాంక్ పడమట వుంచడం - ఇంటిలో రోగాలను నివ్వారించడం.

151. వాయవ్యంలోపాయిఖానా - సుఖాలకు పరచిన జంబుఖానా.

152. వాయవ్యంలో గొయ్యితో మరుగుదొడ్డి - వాదులాటకు చిచ్చుబుడ్డీ.

153. ఉత్తరంలో సెప్టిక్ ట్యాంక్ - ఉత్తమ ఫలితాలనిచ్చు బ్యాంక్.

154. ఉత్తర ముఖంగా లెట్రిన్‌లో కూర్చొనండి - ఉత్తమ ఆరోగ్యాన్ని కూర్చుకొనండి.

155. ఈశాన్యంలో మరుగుదొడ్డి - అంతులేని అరిష్టాల మడ్డి . ( మడ్డి = మలినం)

## 19. భూగృహం (సెల్లార్)

156. తూర్పున భూగృహ నిర్మాణం - కలిగించును నిత్య కల్యాణం.

157. దక్షిణాన భూగృహ నిర్మాణం - ఆయుక్షీణతకు కారణం.

158. పడమట భూగృహ నిర్మాణం - కడతేరని కష్టాలతో రణం. (రణం = యుద్ధం)

159. ఉత్తరాన భూగృహ నిర్మాణం - స్త్రీలకు ముత్యాల ఆభరణం.

## 20. ఇంటి ఆవరణలో ఉపగృహం

160. ఆగ్నేయంలో తూర్పు సరిహద్దు అంటని ఉపగృహం - అతివలకు అనంత శుభాల అనుగ్రహం.

161. ఆగ్నేయంలో తూర్పు సరిహద్దును తాకిన ఉపగృహం - గృహస్థునికి అశుభాల ఆగ్రహం.



162. నైరృతిలో ఉపగృహం - నిత్య శుభాల సంగ్రహం. (సంగ్రహం = కూడబెట్టు)

163. వాయవ్యంలో ఉత్తర సరిహద్దుపై ఉపగృహం - శుభాలకు నిగ్రహం. (నిగ్రహం = అడ్డగించడం).

164. వాయవ్యంలో ఉత్తర సరిహద్దు అంటని ఉపగృహం - దివ్య సుఖాలను ఇచ్చును అహరహం. (అహరహం = అనుదినం)

165. ఈశాన్యంలో ఉపగృహం - నాశనం చేయు శని గ్రహం.

## 21. నుయ్యి (బావి, కూపం, బోరింగ్)

166. తూర్పున బావి - మార్పులేని సుఖాల తావి. (తావి = పరిమళం)

167 ఆగ్నేయ కూపం - అతివల అనర్థాలకు ప్రతిరూపం.

168. దక్షిణంలో బావి - తరుణులకు మరణాల దీవి.

169. నైరృతిలో నుయ్యి - మృత్యువు చాచిన చెయ్యి.

170. పడమట బావి - పురుషుని ఆరోగ్యానికి ఎండమావి.

171. వాయవ్యంలో బావి - జగడాల కొరివి.

172. ఉత్తరంలో నుయ్యి - ఉత్తమ దీవెనలిచ్చు చెయ్యి.

173. ఈశాన్యంలో నుయ్యి - విశేష శుభ ప్రదాయి.

174. మొదట ఈశాన్యంలో బావిని త్రవ్వించు - దాని నీటితోనే నిర్మాణం ప్రారంభించు.

## 22. వాలు వరండా

175. తూర్పు వాలు వరండా - పురుషుల ఆరోగ్యానికి అండ.

176. దక్షిణం వాలు వరండా - సిరికి, స్త్రీకి గుండెల మీద బండ.

177. పశ్చిమం వాలు వరండా - పురుషుల ఆరోగ్యానికి ఎర్రజెండా (అపాయం).



178. ఉత్తరం వాలు వరండా - స్త్రీల సుఖాలకు, ఐశ్వర్యాలకు గెలుపుదండ.

## 23. వరండాలో గదులు

179. తూర్పు వరండాలో ఆగ్నేయాన గది - సుఖశాంతులను ఇచ్చు నది.

180. దక్షిణ వసారాలో ఆగ్నేయాన గది - స్త్రీలను బాధల పాలు చేయు అంబులపొది.

181. దక్షిణ వరండాలో నైరృతి అర - మగవారికి క్షేమ తార. (శుభ నక్షత్రం)

182. పశ్చిమ వరండాలో పశ్చిమ నైరృతి గది - పురుషులకు జీవన నిధి.

183. పశ్చిమ వరండాలో వాయవ్యం అర - పురుషుని అభివృద్ధిని కప్పివేయుతెర.

184. ఉత్తర వరండాలో వాయవ్యాన గది - అతివల ఆర్థిక శుభాలకు ప్రోది. (ప్రోది = పెంపు),

185. ఉత్తర వరండాలో ఈశాన్యాన గది - ఉవిదల శుభలాభాలను చేస్తుంది బూది. (బూది = బూడిద)

186. తూర్పు వరండాలో ఈశాన్యాన గది - పురుష పురోగతిని క్రుంగతీయు గుది. (గుది = బండకొయ్య)

## 24. బీరువాలు

187. గదికి తూర్పున బీరువావుంచకు - వచ్చే నీ రాబడిని త్రుంచకు.

188. గదికి ఆగ్నేయంలో బీరువా - ధనాన్ని తన్నుకుపోయే బోరువ. (బోరువ = పెద్దగద్ద)

189. గదికి దక్షిణాన బీరువా - ధనం రావడానికి వరవ. (వరవ = తూము)

190. నైరృతిలో ఉత్తరాభిముఖంగా వుంచిన బీరువా - పెరిగిపోవు సిరుల కరువ. (కరువ = కొండ)

191. గదికి నైరృతిలో తూర్పు ముఖంగా వుంచిన డబ్బు మందసం - సిరులకు నిరంతర ఆవాసం. ( మందసం = పెట్టె)



192. గదికి పశ్చిమంలో తూర్పు ముఖంగా వుంచిన బీరువా - సిరులకు చొరవ. (చొరవ = ప్రవేశం)

193. గదికి ఉత్తర వాయవ్యంలో బీరువా - సిరి చలనానికి త్రోవ.

194. గదికి ఉత్తరాన వుంచిన డబ్బు మందసం - ఎప్పుడూ తారాడవలసిందే డబ్బు కోసం.

195. గదికి ఈశాన్యంలో బీరువా - దరిద్రానికి చేరువ.

## 25. ద్విశాల నిర్మాణాలు ( L ఆకారం)

196. ఆగ్నేయ ద్విశాల నిర్మాణం - చోరాగ్నులకు ప్రేరణం.

197. నైరృతి ద్విశాల నిర్మాణం - సౌఖ్యానికి చంద్రశాల. ( చంద్రశాల = వెన్నెల)

198. వాయవ్య ద్విశాల నిర్మాణం - వ్యవహారాల్లో విజయాలు శూన్యం.

199.. ఈశాన్య ద్విశాల నిర్మాణం - అరిష్టాలకు స్థానం.

## 26. త్రిశాల (U ఆకారం)

200. త్రిశాలకు తూర్పున ఖాళీస్థలం - పురుషుల పలుకుబడికి బలం.

201. త్రిశాలకు దక్షిణాన ఖాళీస్థలం - స్త్రీల సుఖాలను నరకు కరవాలం.

202. త్రిశాలకు పడమట బయలు - పురుషుల ఆరోగ్యానికి తప్పును హోయలు. (హోయలు = విలాసం).

203. త్రిశాలకు ఉత్తరాన ఖాళీజాగా - స్త్రీల సౌభాగ్యాలను పెంచును బాగా.

## 27. హెచ్చుదొడ్లు

204. ఆగ్నేయంలో హెచ్చు దొడ్డి - అన్ని వ్యసనాలను చేర్చు దిడ్డి. ( దిడ్డి = చిన్న వాకిలి)

205. వాయవ్యంలో హెచ్చుదొడ్డి - తగాదాల చిచ్చుబుడ్డి.



206. ఈశాన్యంలో హెచ్చు దొడ్డి వుంచడం - ఇంటిలోనికి శుభాలను రప్పించడం.

207. హెచ్చుదొడ్డి వున్నప్పుడు నైరృతిలో - నిర్మాణం తప్పనిసరి ఆ స్థలంలో.

## 28. గోబర్ గ్యాస్ ప్లాంట్

208. తూర్పు వైపు గొయ్యితో గోబర్‌గ్యాస్ ప్లాంట్ -ఇంట భోగభాగ్యాల గ్రాంట్. (గ్రాంట్ = నిధి).

209. దక్షిణాన గొయ్యితో గోబర్‌గ్యాస్ ప్లాంట్ - ఇంట్లో శుభాలకు డిస్కౌంట్.

210. పడమటి గొయ్యితో గోబర్‌గ్యాస్ ప్లాంట్ - ఇంట్లో అశుభాల అకౌంట్.

211.. ఉత్తరాన గొయ్యితో గోబర్ గ్యాస్ ప్లాంట్ - ఇంట నిత్యం శుభాలు ప్రజెంట్.

## 29. వీధుల హెచ్చు తగ్గులు

212. తూర్పు పల్లం, పడమర మెరక గల వీధి - అందు నివసించు వారికి సౌఖ్యాల నిధి.

213. తూర్పు ఎత్తు, పడమర పల్లంగల బజారు - గృహస్థులను చేస్తుంది బేజారు.

214. దక్షిణం ఎత్తు, ఉత్తరం పల్లం ఉన్న వీధి - ఐశ్వర్యాలకు వారధి. (వారధి = వంతెన)

215. దక్షిణం పల్లం, ఉత్తరం ఎత్తు ఉన్న వీధి - సకల అరిష్టాల వారిధి. (వారిధి = సముద్రం)

216. ఈశాన్యం పల్లం, నైర్ఋతి ఎత్తువున్న వీధి - సంపదలకు, సంతతికి పెన్నిధి.

217. నైర్ఋతి పల్లం, ఈశాన్యం ఎత్తు ఉన్న బజారు - బ్రతుకులు బహువిధాల దిగజారు.

## 30. తులసికోట

218. తూర్పు పల్లంలో తులసి మొక్క - స్త్రీల ఆరోగ్యమునకు సుఖమైన పక్క.

219. ఆగ్నేయంలో తులసికోట - సుఖాలకు పూలబాట.

220. దక్షిణాన తులసికోట - స్త్రీల ఆరోగ్యానికి కంచుకోట.



221. నైర్ఋతిలో తులసికోట - నారీమణుల ఆరోగ్యభాగ్యానికి వరాల మూట.

222. పడమట తులసికోట కట్టండి - పడతుల ఆరోగ్యానికి పట్టం కట్టండి.

223. పశ్చిమ వాయవ్యంలో తులసికోట - మంచి ఆరోగ్యాన్ని పెంచేతోట.

224. ఉత్తరాన పల్లంలో తులసికోట - ఉవిదల సౌభాగ్యానికి బంగారు పీట.

225. ఉత్తరాన ఎత్తులో తులసికోట - ఉత్తమ ఫలితాలివ్వడం వుత్తమాట.

226. ఈశాన్యంలో తులసికోట - ఇంతులకు ఆరోగ్యమివ్వదు యే పూట.

## 31. పై మేడ

227. ఇంటిపైన తూర్పున కట్టిన మేడ - పురుషులకు పీడ.

228. దక్షిణ భాగంలో మీది సౌధం - ధనాభివృద్ధికి లక్ష్మీపాదం.

229. పశ్చిమంలో పైనున్న మేడ - పురుషుల పురోభివృద్ధికి జాడ.

230. ఉత్తరాన పై మేడ - ధనాభివృద్ధికి అడ్డుగోడ.

## 32. ఇంటిపైన నీటి ట్యాంక్

231. ఇంటిపై తూర్పున నీటితొట్టి నిర్మాణం - పురుషుల పలుకుబడికి గుచ్చుకొను పదును బాణం.

232. వీలులేనప్పుడు ఇంటిపైన ఆగ్నేయంలో నీటి తొట్టిని ఉంచు - కానీ నైరృతిలో దాన్ని మించిన కట్టడం నిర్మించు.

233. దక్షిణంలో ఇంటిపైన నీటి ట్యాంక్ కట్టించుకో - భోగభాగ్యాలను ఇంటిలో పెంచుకో.

234. ఇంటిపై నైరృతిలో నీటి ట్యాంక్ - రెట్టింపు సిరులకు బ్యాంక్.

235. పడమటి దిక్కున ఇంటిపై నీటి ట్యాంక్ నిర్మించుకో - ఆరోగ్యాన్ని ఇంటిలోనికి రప్పించుకో.



236. అనుకూలం లేనప్పుడే ఇంటిపై వాయవ్యంలో నీటితొట్టిని పెట్టుకో - కాని ఆగ్నేయంలో, నైరృతిలో ఒకదాన్ని మించి ఒకటిగా ఎత్తైన కట్టడాలు కట్టుకో.

237. ఉత్తరంలో ఇంటిపైన నీటి ట్యాంక్ కట్టడం - ఉన్న ధనాన్ని బయటకు నెట్టడం.

238. ఇంటిపైన ఈశాన్యంలో నీటిట్యాంక్ - ఇంటిలోన ఖాళీ ట్రంక్.

## 33. ఇంటి ముందు అరుగులు

239. తూర్పున పల్లపు అరుగులు - జీవిత నౌకను సుఖశాంతుల తీరానికి చేర్చు సరంగులు. ( సరంగులు = నావికులు)

240. తూర్పు అరుగులు మెరక - పురుషులకు కొరడా చురక.

241. ఆగ్నేయంలో నైరృతికన్నా ఎత్తైన అరుగు - ఇంటిలోని వారికి ఆరోగ్యం దూరం జరుగు.

242. దక్షిణాన ఎత్తైన అరుగులు - ధనోన్నతికి మెరుగులు.

243. దక్షిణాన పల్లపు అరుగులు - ధనానికి తీరని తరుగులు.

244. నైరృతిలో ఎత్తైన అరుగులు - ఐశ్వర్యాన్ని పెంచు బంగారు మురుగులు. (మురుగులు = చేతి ఆభరణాలు)

245. పశ్చిమాన ఎత్తైన అరుగులు - అభివృద్ధి దెసకు పరుగులు.

246. పశ్చిమాన పల్లపు అరుగులు - పతనానికి పరుగులు.

247. పశ్చిమ వాయవ్యంలో పల్లపు అరుగులు - ఐశ్వర్యానికి విరుగులు.

248. ఉత్తరాన ఎత్తైన అరుగులు - స్త్రీల శుభాలను పిండిచేయు తిరుగళ్ళు, (తిరుగలి = విసరురాయి).

249. ఉత్తరాన పల్లపు అరుగులు - సుఖాలకు పట్టు చెరుగులు.

250. ఉత్తర ఈశాన్యంలో ఎత్తైన అరుగులు - స్త్రీల శుభాలకు చిరుగులు.



251. తూర్పు ఈశాన్యంలో ఎత్తైన అరుగులు - పురుషుల ఘనతను క్రుళ్ళజేయు పురుగులు.

## 34. అటకలు

252. తూర్పు గోడకు వుండే అటక - భయపెట్టే పటాక.

253. దక్షిణ గోడకు ఉండే అటక - గృహస్థుకు బంగారు పటకా (పటకా = వడ్డాణం).

254. పడమటి గోడకు ఉండే అటక - శుభఫలితాలకు పీఠిక.

255. ఉత్తర గోడకు ఉండే అటక - ఉపద్రవాల పుట్టుక.

## 35. చెట్లను పెంచడం

256. తూర్పున చెట్లను పెంచకు - వాస్తు బలాన్ని త్రుంచకు.

257. తూర్పు ఆగ్నేయంలో పూల మొక్కలను పెంచు - శుభఫలితాలను అనుభవించు.

258. దక్షిణ ఆగ్నేయంలో చెట్లను పెంచు - అవి శుభాలను నీయింటవుంచు.

259. దక్షిణ దిశలో వృక్షపోషణ - ఇంటికి అన్ని విధాల రక్షణ.

260. దక్షిణ నైర్రుతిలో చెట్లపెంపు - స్త్రీలను ఆరోగ్యంతో నింపు.

261. పశ్చిమ నైర్రుతిలో చెట్లను పెంచడం - పురుషులకు ఆరోగ్యం కలిగించడం.

262. పశ్చిమంలో చెట్లను పెంచడం - ఆరోగ్యాన్ని పోషించడం.

263. పశ్చిమ వాయవ్యంలో పెంచుకొను చెట్లు - ఉన్నతికి, ఆరోగ్యానికి బంగారు మెట్లు.

264. ఉత్తర వాయవ్యంలో పూల మొక్కలు - ఉత్తమ అదృష్టపు చుక్కలు. (చుక్కలు = నక్షత్రాలు)

265. ఉత్తరాన వృక్షపోషణం - విత్తము క్షీణం అనుక్షణం (విత్తం = ధనం).

266. ఉత్తర ఈశాన్యంలో చెట్లు - స్త్రీల ఆరోగ్యానికి పాము కాట్లు.



267. తూర్పు ఈశాన్యంలో చెట్లు - పురుషుల ఆరోగ్యానికి విషపు బొట్లు.

## 36. బరువులు

268. తూర్పు భారం - ఐశ్వర్య, కీర్తులు దూరం.

269. దక్షిణాన భారం - ధన, ధైర్యాలకు వరం.

270. పశ్చిమంలో భారం - నిరంతర సుఖాల తీరం. ( నిరంతరం = ఎల్లప్పుడు)

271. ఉత్తర దిశలో బరువు - విత్తం, చిత్తశాంతి కరువు.

272. ఈశాన్యంలో బరువు - ఇక వుండదు సుఖమైన బ్రతుకు దెరువు.

## 37. పెంటకుప్పలు - రాళ్ళగుట్టలు

273. తూర్పున పెంట కుప్పలు, రాళ్ళగుట్టలు - ధన, ఆరోగ్యాలను కాటువేయు పాములున్న పుట్టలు.

274.దక్షిణంలో పెంటకుప్పలు, రాళ్ళగుట్టలు - ఐశ్వర్యానికి గట్టిపట్టులు.

275. నైరృతిలో ఎత్తైన రాళ్ళగుట్టలు, పెంటకుప్పలు - ఆర్థికాభివృద్ధికి ముత్యపు చిప్పలు.

276. పశ్చిమంలో పెంటకుప్పలు - మంచి ఫలితాలకు మెప్పులు.

277. ఉత్తరంలో పెంట కుప్పలు - ధనానికి తప్పవు ముప్పుతిప్పలు.

278. ఈశాన్యంలో పెంట కుప్పలు - సుఖాలను మంటగలుపు నిప్పులు.

## 38. వీధిపోట్లు - వీధిచూపులు

279. తూర్పు ఆగ్నేయంలో వీధిపోటు - ఆర్థికారోగ్యాలను అంతమొందించు అగ్నివేటు.

280. దక్షిణ ఆగ్నేయం వీధిచూపు - శుభాలను మేలు కొలుపు.

281. దక్షిణ నైరృతి వీధిపోటు - సిరులకు, స్త్రీల జీవితాలకు చేటు.

282. పశ్చిమ నైరృతి వీధిపోటు - పురుషుని శుభాలకు కత్తివేటు.



283. పశ్చిమ వాయవ్యం వీధిచూపు - యజమాని నాయకత్వానికి పెద్ద కాపు.

284. ఉత్తర వాయవ్యం వీధిపోటు - ఉవిద శుభాలకు ఈటెపోటు. (ఉవిద = స్త్రీ).

285. ఉత్తర ఈశాన్యం వీధిచూపు - సిరులకు, స్త్రీ సుఖాలకు స్థిరమైన ప్రాపు.

286. తూర్పు ఈశాన్యంలో వీధిచూపు - పురుషులకు సర్వాధికారం కట్టబెట్టే గొప్ప మలుపు.

## 39. పల్లం (తగ్గు)

287. తూర్పు పల్లం - సుఖశాంతులకు మేళం. (మేళం = కూడిక).

288. ఈశాన్యం కన్నా ఆగ్నేయం పల్లం - ఆరోగ్యానికి కళ్లెం.

289. దక్షిణం పల్లం - అదృష్టాన్ని అడ్డుకొనే గొళ్ళెం.

290. నైరృతి పల్లం - మరణానికి మూలం.

291. పశ్చిమం పల్లం - సుఖాలను పొడుచు శూలం.

292. ఈశాన్యం కన్నా వాయవ్యం పల్లం - వ్యవహారంలో చెల్లం.

293. ఉత్తరం పల్లం - బంగారం పళ్ళెం.

294. ఈశాన్యం పల్లం - ఐశ్వర్య, ఆరోగ్యాలకు ఆలవాలం.

## 40. మెరక (ఎత్తు)

295. తూర్పు మెరక - ఆరోగ్య, ధనాలను గ్రుచ్చు గొరక. (గొరక = ఇనుపబాణం).

296. దక్షిణం మెరక - అదృష్ట తారక. (తారక = నక్షత్రం)

297. నైరృతి ఉన్నతి - నరులకు అభ్యున్నతి.

298. పశ్చిమం ఎత్తు - గృహస్థుల పాలిటి బంగారు సొత్తు.



299. ఆగ్నేయం కన్నా వాయవ్యం ఎత్తు - గృహస్థులను దిగువకు ఒత్తు. (ఒత్తు = అదుము)

300. నైరృతికన్నా ఆగ్నేయ, వాయవ్య, ఈశాన్యాలు ఎత్తు - చేస్తాయి యజమానిని తొత్తు. (తొత్తు = బానిస).

301. ఉత్తరం మెరక - దరిద్రానికి పడక.

302. ఈశాన్యం మిట్టు - ఐశ్వర్యానికి కొట్టు. (కొట్టు = శూలం)

## 41. మూలల పెంపు

303. తూర్పు ఆగ్నేయం పెంపు - అనర్థాలను నింపు.

304. దక్షిణ ఆగ్నేయం కోణంగా పెంపు - అనేక తగవులతో తలవంపు.

305. దక్షిణ ఆగ్నేయం మూలమట్టంతో పెరుగుదల - పురుషుల కీర్తికి మెరుగుదల.

306. దక్షిణ నైరృతి పెరుగుదల - తరుణుల శుభాల అరుగుదల. ( తరుణులు =స్త్రీలు)

307. పశ్చిమ నైరృతి పెంచడం - పురుషుని జీవితాన్ని త్రుంచడం.

308. పశ్చిమ వాయవ్యం కోణంగా పెంపు - చపలత్వాన్ని నింపు.

309. పశ్చిమ వాయవ్యం మూలమట్టంగా పెరుగుదల - శుభఫలితాలకు ఎదుగుదల.

310. ఉత్తర వాయవ్యం పెరుగుదల - వంశాభివృద్ధికి తరుగుదల.

311. ఉత్తర ఈశాన్యం పెంపు - ఐశ్వర్యాన్ని ఇంట నింపు.

312. తూర్పు ఈశాన్యం పెంపు - పురుషుల ఆరోగ్యభాగ్యాలకు ఇంపు.

## 42.మూలల తెంపు

313. ఆగ్నేయం తెంపు - ఉండబోదు తలవంపు.

314. నైరృతి తెంపు - రాబోదు ముంపు.

315. వాయవ్యం తెంపు - మైత్రికి ఇంపు.



316. ఈశాన్యస్థలం తెంచుకోకు - వంశాభివృద్ధిని త్రుంచుకోకు.

317. అనవసరంగా స్థలం తెంచుకోకు - అనుమానాలను పెంచుకోకు.

## 43. కప్పు (మూత)

318. తూర్పు కప్పు - మగసంతతికి ముప్పు.

319. తూర్పు ఆగ్నేయం హద్దుపై కప్పువేయుట - సంతతి సుఖశాంతులను నిప్పులలో త్రోయుట.

320. దక్షిణం కప్పు - తరుణుల సౌభాగ్యానికి మెప్పు.

321. నైరృతి కప్పు వేసుకో - సిరులను కుప్పపోసుకో !

322. పశ్చిమం కప్పు - గృహస్థు ప్రతిష్ఠను చాటిచెప్పు.

323. ఉత్తర వాయవ్యం కప్పు - స్థిరత్వానికి త్రుప్పు. ( త్రుప్పు = చిలుము).

324. ఉత్తరం కప్పు - విత్తమునకు నిప్పు.

325. ఈశాన్యం కప్పువేసికొనడం - యమపాశాన్ని గొంతుకు బిగించుకొనడం.

## 44. తెరప (తెరపి)

326. తూర్పు తెరప - పురుషుల కీర్తినావకు ఎత్తిన తెరచాప.

327. దక్షిణ తెరప - తరుణుల సౌభాగ్యాలను మ్రింగు సొరచేప.

328. పడమట తెరపిగా వుంచుకోకు - ఆరోగ్య సంపదలను త్రుంచుకోకు.

329. ఉత్తరాన తెరప - అన్ని విధాల ఉన్నతికి తాప.

## 45. పూజగది

330. ఇంటిలో పూజగది ఏ దిశలో వున్నా - ఎలాంటి లోటు కలుగదన్నా !



331. ఈశాన్య గదిలో స్థిర నిర్మాణం - వాస్తుబల నివారణం. (నివారణం = తొలగింపు)

332. నైరృతిగదిలో స్థిర నిర్మాణం - వాస్తు బలపోషణం ( పోషణం = పెంచడం).

333. తూర్పుముఖంగా దేవుని అర్చించు - ఆరోగ్య భాగ్యాలను ఆర్జించు.

334. పశ్చిమ ముఖంగా అర్చన - శుభాలను చేర్చు నిచ్చెన.

335. భువికి రవియే ఆధారం - అందుకే తూర్పు పడమర ముఖంగా పూజలకు అంత ప్రాచుర్యం.

## 46. అనుభవంలో విఫలమైన ఆచారాలు

336. శ్రీ చక్రం కొన్నవారికి రాదు సిరి - అమ్మిన వారికి సిరి తప్పని సరి.

337. వాస్తు గోళాలు, మత్స్యయంత్రాలు - మాయావుల కుతంత్రములు.

338. వాస్తుదోషాలకు వేసే తాయెత్తులు - గృహస్థులను దోచేందుకు చేసే జిత్తులు.

339. కాకి ఇంటిలోనికి వస్తే తప్పేమీ లేదు - కానీ పలుగాకి వస్తే చీకాకులు తప్పేది లేదు.

340. ఇంట్లో తేనె తెట్టె పెట్టడం వల్ల - ఇక్కట్లు కలగడం కల్ల.

341. భూమిలోని బొగ్గులు - చేయవెట్టి ఎగ్గులు . (ఎగ్గు = కీడు)

342. గడప క్రిందరాయి పగిలితే రాదు అరిష్టం - ఇంటికి లేదు యే దురదృష్టం.

343. ఇంటి ఆవరణంలో మొలిచే రావణహస్తం - ఎట్టి నష్టం కలిగించదు నేస్తం ! (రావణహస్తం = ఒకరకం పుట్టగొడుగు)

344. ఇంటికి ద్వారాల సంఖ్యకాదు ప్రధానం - ఉచ్ఛపు నడకలే ప్రధానం.

345. వెయ్యిదీపాలుంటే వాస్తు అవసరం లేదా ? - వెయ్యి ఆసుపత్రులుంటే జ్వరం రాదా ?



## 47. సామాన్య విషయాలు

346. తూర్పు ముఖంగా కూర్చొని చదువు - విజ్ఞాన సంపద ఒదవు. (ఒదవు = కలుగు)

347. ఉత్తరముఖంగా కూర్చుని వ్యవహరించు - విజయం నీ ఇరేట విహరించు.

348. ఇంటి భూమి అడుగున ఎముకలుంటే రావు కష్టనష్టాలు - వాస్తు బద్ధంగా ఇల్లు కడితే తరలివస్తాయి అదృష్టాలు.

349. కులానికి ఒక్కొక్క రకం నేల అనే మాట - కలుపుతుంది మానవతను మంట.

350. గృహానికి ధ్వజ, గజ, సింహాది ఆయాలు - గృహస్థునికి అయోమయాలు.

351. గడపకు పసుపు దిద్దు - క్రిమి కీటకాదులకు అది హద్దు.

352. ద్వారానికి మామిడాకుల తోరణం - కీటక సంహరణం.

353. ఇంటి ముందు పేడనీళ్ళు చల్లడం - క్రిమికీటకాలకు ఆయువు చెల్లడం.

*354.* ఇంటికి సున్నం కొట్టడం - క్రిములను మట్టు పెట్టడం.

*355.* దేహవక్రతలకు ప్లాస్టిక్ శస్త్ర చికిత్స - గేహ వక్రతలకు వాస్తు శాస్త్ర చికిత్స.

*356.* శాస్త్ర రీత్యా గృహ నిర్మాణం - కలిగించును నిత్యకల్యాణం.

